ఉత్పల రచనావళి ౬

# తపతి

ఉత్పల సత్యనారాయణాచార్య

డాక్టరు

# శ్రీ చంద్రమౌళి సత్యనారాయణరావుగారికి

## సమర్పణము

తెలతెల వాఱువేళ భవదీయ
గృహమ్మున కేగుదెంచి పి
ల్లల గలవాడనంచనెడు లంపటుడొక్కరుడు
దగ్ధమయ్యె నా
నిలయమటంచు నింకొకడు
నేటికి నాలుగులంకణా లటం
చలగు మఱొక్కడీవరుస
యాచకు లొక్కకడే బయల్పడున్

లకిలుబెట్ట ఎన్నికల రచ్చ
ఒనర్చెడు నాయకుం డెవం
డకియపాత్రలో పిడికెడైన
విదిల్చెడు—దైవదూర దు
ర్భిక్ష పతద్దరిద్ర దురదృష్టులపై
కరుణించుటన్ జగ
ద్రతున కప్పుబెట్టిన
వదాన్యుడవైతివి నీవు నేడిలన్

నీ దాతృత్వము పెంపుచేయుటకు నేనీ—నీకు లోకేశు డా
పాదింపంగలవా డితోధిక ధనప్రాబల్య మాభోగ తే
జోదీర్ఘాయు వమేయసంపద లనుస్యూతమ్ముగా నెప్ప డా
మోదార్ద్ర ప్రియతాపరాయణుడకావో సత్యనారాయణా !

అతడు దరిద్రు డీతడు ధనాఢ్యుడునైనదిలేదు రోగులం
దతిథి సపర్యలందును మహాశయ ! నీసమభావ ధర్మ సం
స్కృతికయి బాపుజీ కలవరించెను కాని, తదీయ బాధ్యతా
యుత పరిపాలనందొకసి యోగ్యునిగా నొనరింపలేదటే !

ఖద్దరు కట్టుకుండినను గాంధిమహాత్ముని దివ్యతత్వ సం
పద్దశనందుకొన్న ప్రతిభామతి పచ్చపు స్వామ్యవాదివై
రద్దియొనర్పకుండినను రైతులకున్ మతి కార్మికాళికిం
దద్దయు గూర్చువాడ వమితప్రియతాదర చిత్తవృత్తులన్

దీపము పెద్దదైనకొలదిన్ నలుదిక్కుల నంతకంతకున్
జూపుచు ధూమశూన్యము విశుద్ధమునై వెలుగొందురీతి నీ
ప్రాపున దాతృతాగరిమ పండుకొలంది తదీయదివ్య దో
షాపహకీర్తి చంద్రముడవై కయికొమ్మిది నూలుకాన్కగన్

# తి ప తి

(ఇది భావనాప్రకృతిలోని ఒక కళాచిత్రము. ఇందు లోనివి ఛాయాపాత్రలు. రూపాలు కాల్పనికాలు. ఈ కళానుభూతి మాత్రము ఏకాంతమయినది)

అది—యమునానదీ పరిసరాంతరసీమల దూరదూరమై
నది ఒక ఆనవా లచటనా వినవచ్చెడు బృందగాన—మీ
మృదుమురళీరవ - మ్మచటనే వ్రజసుందరు డొక్క నూతన
త్రిదివము గట్టినా డిసుకతిన్నెల వెన్నెల నిగ్గుపూతలన్

'వ్రాలిన సంజలఞ్ జిలుగునాత్తనయట్టి తమాల మాలతీ
జాలములోన నిన్ను కనజాలను రా! జగదేకసుందరా!
చాలుర—రార! ఈ ఇసుకచాల్పుల వెన్నెల లారబైట న
న్నేలుమురా ప్రభూ! వ్రజకులేశ్వర! రాధను నేనె వచ్చితిన్'

అని వినిపించుచున్న యటులా యమునానది మంజుమంజుల
ధ్వనులు!-వ్రజాంగనాముఖరితమ్ములు!-జృంభితయౌవనోజ్జ్వల
జ్జనిత రసాతిరేక రభసమ్ములునై నినదించి పొంగి పా
ర్లిన దలనాటి ఆ వలపుతే పులినమ్ముల జాలువాఱెడిన్

పాయల్ పాయల సూర్యపుత్రి ప్రవహింపన్ జొచ్చె నచ్చోట నా
సాయంకాలపు టెండ ఏటికిరుపార్శ్వాలందు బంగారపుం
జాయల్ దిద్దిన పచ్చకోకలవలెన్ గన్పట్టె సంధ్యారుణ
చ్ఛాయారూషిత నీలమేఘపటలీ సందేహమై తోచెడిన్ !

ఆవర్తమ్ముగ వంపులై తిరుగు చా ఆకాశలక్ష్మీగళ
ద్గ్రైవాలంకృత తారహారములవోలెన్ బకీయుగ్మమ్ము లే
వేవో గుర్తుల నంటిపెట్టికొని తా మెచ్చోట కే వేళ త
ద్ద్వైవాపృథ్యవసాన సీమలకు నౌనా ఏమి ! ఈ యానముల్

ఆది విజన జనస్థాన—మయ్యది వినీల
నీరదాకాశ బింబిత నిర్మలమ్ము
ఒక జలాశయమ్మచటనే ఒక నికుంజ
పుంజ మంజుల గుంజనామోద పదము

నీలి మబ్బులు మత్తిల్లి నేల మీద
పండినట్టులు పచ్చని పట్టులందు
అడు గిడినయంత నీళ్ళూరి మడుగులగుచు
చల్లదనమెల్ల నచట రంజిల్లుచుండె

విగళితాంబరలయి పట్టపగలె మునుగ
మలిన పులినమ్ములును సిగ్గుమాలినవిర ।
అతులితానంద నవయౌవనాభిషేక
మమరజేసెడు నమృత హస్తముల యమున

పడమటకొండ—కొండకటుప్రక్కన సన్నని బాట — బాటపై
నడచుచు వచ్చుచున్నయది నాగిణి కాదది యేమొ చాయ అ
య్యెడపొడ రానురాను నవయౌవనియై విలసిల్లి గున్నమా
మిడికద నిల్చియున్న దనిమేషదృగంచల చంచలాక్షియై

వింతగాతోచె నతనికీయింతి—ఇంత
దనుక చూచిన ప్రకృతి సౌందర్యమందు
ఏదొ లోపించినట్లయ్యె; నీమెయుండి
తియతియ్యాల తీర్చిదిద్దినది ఇపుడు

ఒక జగదేకమోహన సముజ్జ్వల యౌవనరూప మీ ప్రపం
చకమున సుందరప్రకృతి సంపదలందున దాగియుండుటల్
నికరము కాకపోయిన, జనించిన ఈ అనుభూతిలోన ఇం
చుక ఎదియో కొఱంత పొడసూపెడునే! రసవత్ప్రపాసికన్

ఘనఘన ఘోటక ప్లుత గతుల్ వినిపించినవేమొ ఆమె చి
వ్వున నొక చాతకమ్మెగిరిపోయినమాడ్కి ససంభ్రమాంగియై
కనుగొనె నంత—కట్టెదుటగా నరుదెంచుచునున్న రాకుమా
రుని—సుకుమారునిన్—ఘనపురూరవ రాడతిలోకశూరునిన్

హృదయవారిధి ఆశావిశృంఖలమయి
అలలపైకెక్కి అలతె నాట్యములుచేయ
ముగ్ధమౌన మనస్సు నున్మఖసుఖమ్ము
తిరస్కరింపగ తపతి అదృశ్యయయ్యె

ఆ యమునానదిన్ జలకమాడెడి దొక్కతె లోతులోతుకుం
బోయి గుభాలునన్ మునిగిపోవుటజూచి హయమ్ముదిగ్గి రా
జాయెడకేగుదెంచి దిగునంతటిలోపల నామె తేలి రా
బోయి పదంపడిన్ మునిగిపోయిన దాతనిచూచి సిగ్గునన్

మిలమిలలాడు నొక్క చిఱుమీను బుడుంగన మున్గినట్లు-క
న్నుల మిఱుమిట్లుగొల్పి, ఎటనుం గనరాక నదీజలమ్ములో
కలగిన వర్తులవల్ సుడులుగట్టుచు బోయినచోటులెల్ల ని
ర్మలములు నయ్యె కాని, కనరాదట మున్గిన దెంతపట్టుకున్

కొంతసేపటి కాయమ కుంతలములు
చల్లగా తేలియాడె కచ్ఛపము పోలె
వచ్చి—వచ్చి అతని సమీపమ్మునందె
నిలచినది నగ్నసౌందర్య నిర్ఝరిణిగ!

'—కలువరేకులవంటి కన్నుల నిగిడ్చి
ఓరగా చూపు నావైపు పాఱజేయ
క్రొత్తగ సృజియింపబడు జగత్తునందు
తొలి ఉషఃకాంతి కురిసినట్టులయె నాకు

అపరిచిత ముగ్ధసుందరీ! ఇపుడు నీదు
కదల మెదలని పెదవుల కంపనమ్ము
జడ విలోచనముల స్వప్నజాగరమ్ము
సుప్తిలోకూడ జాగృతి శోభనింపె!

పలుచని సన్నకావి వలిపమ్ము శరీరము నంటియున్నటుల్
తెలుపగరానివై ప్రతిఫలించిన నీదు భుజాలవంపు సొం
పులు–సకలాంగసుందర సముచ్చయరూపము! నాదుముంగటన్
నిలచిన బొమ్మవా! పలుకనేరుతువా! ఒకమాటయైననున్

స్నానసుందరి! నీమేని జాలువాఱు
జలకణమ్ములు స్వర్ణబిందులుగ మాఱి
జాఱి—దిగజాఱిపోవు నచ్చంపు పాల
ఱా ప్రతిమపయిఁ బద్ధ నీరమ్మువోలె—'

అతని పలుకొక్కటేని విన్నట్లులేదు
శీర్ష మొకపరి ఎత్తిచూచినది—అంతె;
వినతి ఏదియొ ఆమె లోచనములందు
సహజకాంతిని మచ్చరించందొడఁగె

అనిమిషలోచనమ్ము లతడామెపయిం బరపించు చోటు లె
ల్లను గిలిగింత పెట్టినటులై పులకించిన సుందరాంగి, తా
మునుపటి రీవినే మఱచిపోయి, సమమ్ముగనిల్వజాల కా
తని నెటు తప్పుకొందునని తగ్గిసమగ్గిసలయ్యె సిగ్గునన్

అత దట్టుల చూచుచున్నంతసేపు
ఆమె తలవంచి నిలుచున్న దంతవరకు—
నిలిచినది నిల్చినట్టుతె నీళ్ళుచిమ్మి
పాఱిపోయిన దొక తెప్పపాటులోన

ముద్రలువేసి యామెపథము౽ గురుతింపుచు పాఱిపోవ ని
ర్నిద్ర సమాధిలో పలపరించుచు ప్రేమ తపస్వి దీక్షగా
తద్రమణీయరూపము యథావిధి చూచునుకాని ఆమె ప్రా
గ్రద్రుతయైనయట్టు లెఱుగండు—తదేకవిలోక నమ్మునన్

అంత నామెకై వనమెల్ల నధిగమించి
వేయికన్నులు చేసుక వెదకినాడు
విసిగి విశ్రాంతికై వచ్చి వెదకబోయె
మరల నొకయాశ మెఱసి సంవరణరాజు

తురగ హేషా నినాదమ్ముతో నులిక్కి
పడి నదీప్రాంతభూముల పాఱజూచె
హయ సమారోహ యత్నికృతాపసవ్య
తపతి నటగాంచి రాజు సంతసముచెంది

అడుగులో నడుగిడుచు సవ్వడికి దడసి
పాదల నొదుగుచు గదసినా డదనులోన
తట్టువెక్క్రడి పడతి క్రిందకును పడక
జాఱిపడె—రాకుమారు హస్తములలోన

'నన్ను సగ మాక్రమించుకొన్నావు నీవు
నిను విడచి పరిపూర్ణుడ నేను కాను —
ఇన్నిరోజులు హృది దాచికొన్న ఏ ర
హస్యమంత్రమ్ము నేడు విప్పారుచుండె!

పట్టుబట్టి నాదృష్టి నాకట్టివైచి
నెమకుచున్న నాకనుల కడ్డముగ నేదొ
యవనికన్దింపి ఏ రహస్యంపు సరసి
గ్రుంకులిడుదాన వెవర వీవింకచెపుమ!'

లజ్జితాచ్ఛ కోమల కపోలములనంటి
సవసవాజ్ఞాత యౌవనచ్ఛవులు ప్రాక
తెచ్చుకొను నవ్వునవ్వి ఆదిత్యపుత్రి
పలికినది ఇట్టులపుడు నిర్భయముగాగ

'ఏమిటయా! ఇదేమిటి మతీ! విపరీతము నీది కన్యకా
కోమలచిత్త చౌర్యమునకుం బలెనే సులభమ్మటంచు న
న్నీమెయి నింతలో నపహరించుకపోదువ? నీదు రీతు లా
గాములు చేతలున్ జగముకన్నగు మా జనకుండు చూడదా!

ఎత్తుట కెంతతేలికయొ ఇద్ది భరించుట కంతభార మా
ర్యోత్తమ! వేడికో లౌకటియున్నది, ప్రేమ భరైక జీవితో
దాత్తముగోరెదో చివరిదాకను మోయుమిదేవిధమ్ముగా
వత్తును స్వర్గసీమకును—వత్తును ప్రేత పరేత భూమికిన్

నీవు పరదేశి నేను కన్నియనుకాదె
ఎట్లుచెప్పెద సిగ్గు నోరెత్తనీదు—
విడచిపుచ్చు—'మటంచు నవ్వినది తపతి
పలికె సంవరణుండును పట్టుజార్చి

'రాకొమరుండ సంవరణరాజును నీజనకుండు సూర్యుదే
నాకుగురుండు దేశికుడు నా అభివృద్ధిని కోరువాడు ని
ష్టైకద వారిసన్నిధిని వీడ్కొనివచ్చితి వారియింటిలో
నా కొకనాడుకూడను కనంబడవీవు విచిత్రమయ్యెదున్

దాపెదవేలనో హృదయదాయిని! గాయకు డొక్క చిన్న ఆ
లాపనలోనె గానకుశలత్వము సర్వసమగ్రపొందితీ
రూపముజూపడా! క్షణములోపల — నీ హృదయప్రవాహమే
భూపరివాహమై పయికిపొంగద! నీ కనుగుంటలందునన్

సురసుర కాల్చు నీదు సొగసుందనమంతు సురింగిపోవ, బం
ధుర సుషమా సరిత్స్ఫురణ తుంగ తరంగము లొక్కసారి పై
నురవడివచ్చి ముంచిన వహో రుచిరుజ్జ్వలరూప! ఎంత సం
వరణుడనైన నీకు వశవర్తిని భారత చక్రవర్తినిన్

గమకమ్ముల్ విదళించు గంధవహురెక్కల్ రెంటిపైకెక్కి పో
వముదారమ్ము — లతావితాన సుమనోద్వారమ్ము లావిష్కరిం
తముదేవీ! తడవేల మాయు తమిరానన్ వాసరార్ధమ్ము వ్య
ర్థముకాజొచ్చెడు నవ్యయౌవన వసంతశ్రీల నోలాడగన్

అంతంతన్ జనెదేల? దగ్గఱకు రా స్పర్ధించుచున్నాద నా
అంతర్దాహము ఎంతదుస్సహమొ చానా! రమ్ము-రారమ్ము-వి
న్పింతున్ నీకు హృదంతరధ్వనులు గుండెల్ రెండునున్జేర్చుకొ
న్నంతన్ గాని ఎఱుంగ వీ ప్రియ పిపాసాయాస వైవశ్యమున్

నీ వాలింగనతన్మయత్వమవు ! పాణిద్వంద్వ సంవేష్టిత
గ్రీవాచుంబనమీవు యౌవనశుభాంగీ ! నీ మనోభావముల్
నీవై చెప్పకపోయినన్ నిమిషమేని చెప్పికొనిమ్ము నే
డీవృత్తాంతము కన్నులన్ గనుల గుండెల్ గుండె లూర్పూర్పులన్

నిను నేబాసి చనంగజాల నిచటన్ నీతోడిదే లోకమై
మనువాడన్ ప్రియురాల! మత్సకల సామ్రాజ్యాధికారమ్ము సం
తను నీకై త్యజియింతు నీ ప్రణయమౌనస్పర్శతే నాకు జీ
వన మాధుర్యము దివ్యలోక మహితైశ్వర్యప్రదానందమున్

ఋణపడిపోదు నీకు హృదయేశ్వరి ! నేనొక తామరాకుపై
తొణికెడు మంచుబిందువును దొర్లుచు నీ నవబావినీటిలో
నణగెదనేమొ ! నీవు కిరణమ్మవునై నులివెచ్చనల్ ప్రసా
రణ మొనరించి లోగొనగరాదె చెలీ! నను నొక్కమాటున్'

కేలన్ గాజులు ఘల్లుఘల్లురనగన్ గించిచ్చలోరోజ ద
ర్శ్యాలచ్ఛాయల నట్టునిట్టు మిసిమింపుల్ నింప నొక్కమ్మడిన్
తాలంఘించి నదీసమీప విపినాంతర్ధానయైపోయి ఆం
ధాలాపించిన దాకుమారి-అనురాగాయత్తచిత్తమ్మునన్

చెప్పెదవేమొ? నేనిటకు చేరి ఉయాలల నూగుచున్న నా
చొప్పెఱిగించెదేమొ వనసుందరి! కొంచెము సేపె యాతనిన్
ద్రిప్పలు పెట్టనిమ్ము — నను నీ పసిపచ్చని పైటచెంగులో
కప్పి ఒకింత నా హృదయకంపనమున్ శమియింపజేయవే!

పాడవె! నీకు వచ్చినటువంటి పదమ్ముల నెంత తీయగా
పాడుద వంతతీయగను పాడవె! కొమ్మలలోన కూరుచు
న్నాడె వసంతరాజు తొలినాడొనరించిన పూజలెల్ల ఈ
నాడె సుమీ ఫలించును వనప్రియ! భాగ్యమటన్న నీదియే

మాపటికీ నదీపులిన మార్గములెల్లను సాంద్ర చంద్రికా
లేపన రంగభూములగులే! చిఱుగజ్జెల కాళ్ళగట్టి నే
గోపికనౌదునా! పయుటకొంగులు గాలికితేలవేసి ఓ
యీ పరదేశి! ని ఎదుర నే మధురమ్ముగ నాట్యమాడనా!

కోయిల పాడుచున్నదదిగో ఒకవంకన గోరువంక రా
వేయని పిల్చుచున్నయది ఎందులకో అనుకొన్నవారు నే
డీ యమునాస్రవంతి ప్రవహింపులనున్ గమనించినారె-ఈ
రేయి అఖండమండల పరీవృతచంద్రిక జూచినారలే!

నాల్గుదినాలనాడు యమునానది పొంగిన పొంగులన్ వసం
బల్గులు నల్గులై మునుకలావగలేదె! తదీయ వైఖరిన్
గల్గిన యౌవనోజ్జ్వల వికస్వర రంజితరాగభాగనై
వెల్గెదుదాన! నా వలపువెల్లువలన్ వనమెల్ల నింపుచున్

నవమృద్వీక మరందముల్ సురభిళానందైక మందానిలా
యువు లిందిందిర బృందగానములు మాయూరారవంబుల్ మృగీ
జవముల్ కాక శుకీపికీ కలకల స్వైరానులాపక్రియా
ప్రవినోదంబగు నీ వసంతవన శోభల్ గాంచ వేంచేయుమా!

నాదగు స్వప్నరాజ్యమున నాయకుడై ప్రణయైక జీవనా
పాదక శాసనమ్ములను పాలనచేయు కళారహస్య సం
వేది—రసానుమోది—కనుపించెనటే తరుపంక్తులార! నా
మీద ననుగ్రహంబునిచి మీరత నిచ్చటి కామతింపరే!

పట్టు జవాజివన్నె తలపాగ—ముఖమ్మున మంచిగంధపుం
బొట్టు—సుదీర్ఘమైన కనుబొమ్మలు—చేరలగొల్చు కన్ను లు
న్నట్టి మనోజుడే! జితజయంతుడె! చుక్కలలోన చంద్రుడే!
చుట్టమతండునాకు వనసుందరి! ఎచ్చటనుండె చెప్పుమా!

గౌరవ రాజవంశ్యుడిటకై అరుదెంచిన అతిథేయ స
త్కార మొనర్పవైతివని తండ్రి మహారుణరూక్షితాక్షుడై
దూఱునొ! కాక నేనతని దోడ్కొనివచ్చిన సంశయించి నీ
త్కారమొనర్చునో! వయసుకన్నియ లన్నిట స్వప్రయోజకల్

తానై దానమొనర్చుకొన్నయది సౌందర్యమ్ము దానప్రథా
ధీనాధిక్యతజెంది నాసొగసునుద్దీపింప నీవో! సదాఽ
న్యూనప్రశ్న పరంపరల్ కురపగా నోరెత్తి ఏదే సమా
ధానం బిచ్చినదాన గానపుడు నాథా! ఏమి భావించెదో

నీజత నిల్చియున్న రమణీప్రియదర్శన ముగ్ధమోహనో
త్తేజములైన నీ ప్రథమదృష్టులు నీ సువిశాలనేత్ర నీ
రేజము లోరగా నొకపరిన్ దిలకింతునొ లేదొ కాని, నా
లో జయదుందుభిధ్వనులు మ్రోసినదీ వయసొక్క మాటునన్

అక్షణమట్ల మైమఱచినట్టులె చూచెదు మాదు కల్పనా
చక్షువులందు భావి వికసన్ముఖసుందర సౌఖ్యజీవనా
పేక్షలు తీవరించి బలవించెదు స్వర్గ సువర్ణ శాలలో
అక్షయ లోక సంపదలకై—అతిలోక సుఖానుభూతికై

ఈ ననకారు వెన్నెలల — ఈ చిఱుతెమ్మెరలందు — కల్పవ
ల్లీ నవ మంజరీ మధు ఝురీ లహరీ రసవత్తరంగిత
ధ్యానములో సుధామధురకంఠముగల్పి మదీయ జీవితో
ద్యాన వసంతమా! హృదయమారగ నీకయి నాలపింతునా!

కమ్మని కాఱువెన్నెలవాగల్ వెలిగ్రక్కెడు చంద్రశాలపున్
గుమ్మమునందు — నందన నికుంజములందున - పారిజాత పుం
జమ్ములలోన — నాట్యరభసమ్ములు నే దనుభూతిలోనివై
గుమ్మయిపోయి నాహృదయగోళము రెండవ స్వర్గమైచనెన్

దాంభికముల్ జరామరణతత్త్వము లీ రజనీ నితంబ నీ
లాంబర నిర్మలాంచలములందునుండి చలించి మంచి ము
త్యంబొకటేని జాఱపడెనా! నవయౌవన విశ్వపూర్ణ పా
త్రంబున పొంగియున్న యమృతంబొకబిందువు బీఱువోయెనా ?

ఏ ననకన్నెపూచునపుడేనియు నింకొకక్రొత్తపాటనే
గానమొనర్చి — క్రొత్తనవకమ్మునె — క్రొత్తపరీమళమ్మె — క్రొం
దేనియనే ఒసంగి ఎలదేటి కవుంగిలిలోన నవ్య సౌ
ఖ్యానుభవమ్ము నొందునపుడా జరయేదిర! మృత్యువేదిరా!

ఋతువుల పూలపళ్ళేరము తెప్పటిమాదిరి నిండుచున్న వ
ద్భుతముగ నెన్నొ నాకనులముందర నా నలువైపులందునన్
ప్రతిసుమమందు ప్రత్యగమునన్ నవయౌవన దివ్యదీప్తులే
అతిశయితమ్ములై శతశతాబ్దసమృద్ధుల నుద్ధరించెడిన్

ఆశలురేపె జీవనరహస్యము లూదెడు నీ జలస్థలా
కాశములందు ప్రాగ్వనికాంతరసీమల—వేణుగాన సం
దేశ మెదో వినంబడగనే—వెస నాహృదివీణ మేళనా
వేశముతో సుదూర వనవీథులలోన ప్రతిధ్వనించెదున్

ఒకతానమై నేను సకలప్రపంచమ్ము
నిండింతు, నాదు సంగీతరవళి !
స్వాతిబిందువునయి వర్షింతు దేశమం
దంతట మంచి ముత్యాలవాన !
అణువులో పరిపూర్ణ యౌవనమ్మును నింపి
మెఱపింతు విశ్వసుందర మహస్సు !
రెండు పెదవులందు నిండిన నా నవ్వు
ఇహ పరమ్ములను ముంచెత్త గలదు !

కదళి — ఏ మాఘమూల నెక్కడనొ కాని
తనరు చుండును — ఒక్క బృందావనమ్ము !
ఉదయమే కల్వ రేకుపై నొదిగి యున్న
శిశిర బిందువే మధురస సింధు వగును !

మ్రోసినది సమస్త మూర్ఛనల లయించి
ప్రేమసంగీత మీ హృదయవీణ
ప్రజ్వలించిన దంగ ప్రత్యంగములలోన
విద్యుదుజ్జ్వల సముద్వేగశోభ
ఆవరించినది దిగంతరాళమ్ములం
దింపు వాసనలమైకంపు మసక
జాగరిల్లినది విశాలకాంతారమ్ము
నీడవెన్నెలలు దోగాడుచుండ
మౌనముపహింప చంద్రికా పాన తరులు
పువ్వులాతుల కవుగిళ్ళ పవ్వళించె
భ్రమర పరిరంభణోద్రేక పతనమయిన
కలువపువ్వు తెప్పరిలి నీళ్ళదులుపుకొనియె

సరగున రావలెన్ విజయసాహిణి! స్వర్ణరథమ్మునెక్కి స
త్వరమరుదెమ్ము మంజులప్రభాతమ! దుర్బల-నిస్సహాయ-ఈ
విరహమయస్వరూపిణికి వీర తమోమయ కాళరాత్రికిన్
జరిగెడు ద్వంద్వయుద్ధమున సాయమురమ్ము! వనాంతరమ్మునన్

*　　*　　*　　*

ఇప్పటికింక నిద్దురయుటే తపతీ! ఇపుడే సుఖస్మృతుల్
కప్పగ నెంతమంచికలలన్ గనుచుంటివొ—! మూసికొన్నకన్
ఱెప్పలనిండుగా ప్రతిఫలించిన నీ సువిశాలనేత్రముల్
విప్పుము నీదుతండ్రిని రవిన్ గనుగొమ్మిక మేలుకాంచుమా!

పర్యయ సంకులోచ్చరితమై పలుకాడెద—వశ్రుపూర్ణ మా
ధుర్యము కండ్లనింపెద—వెదో మృదుముగ్ధ మనోజ్ఞభావ గాం
భీర్యము గండభాగమున పెట్టినదమ్మ! త్వదీయవాంఛితాం
తర్య మదేదొ చెప్పవుగదా! శుభమయ్యెడుగాత నీకికన్

అమ్మాయి నేను నిన్నటి దినాంతమునందు న పశ్చిమాద్రి శృం
గమ్ము లతిక్రమించునెడ జ్ఞాపకమై రథమాపి దూర దూ
రమ్మునుండి యిద్దఱవరాయని చూచితి, నంతలోన గు
ఱ్ఱమ్ములు నీటికై దిగువలాగిన వా యపరాబ్ధిలోనికిన్

*　　*　　*　　*

“ఏతదతీతుడై భవము నీదనివా దొరకదుండెనా ? దివా
భీతము కాఱుచీకటి భీతిలు—నన్ను జలూకమచ్చు సం
జాతము నీటిలో నుఱుక జంతు—నటన్నను నవ్వరే! ధరి
త్రితల మర్త్యసంతతి చరిత్రము మచ్చు దివాంధ వృత్తమే !

ప్రతినయుందు సంసారచక్ర పరివర్త
నమ్మునకు పరిచితుడయి నవయుచుండి
తీరమునకును—సంసార వారినిధికి
నడుమ నిల్చి తపించుచున్నాడు వృథగ

బహుళ నక్షత్ర శోభావిభావరికిని
వదని మండుటెండల మ్రగ్గదలచువాని
బుద్ధివైదగ్ధ్య మీవెట్లు పొగడగలవు
దేవుడైన సంసార నిర్దేశితుండె !

కాహళము లూది చేయు కోలాహలమ్ము
ఉపకరింపదు జగతి సముద్ధరింప—
విధి విధాన మెఱుంగు జీవితమె చాలు
ప్రాభవైశ్వర్యములకు వారసుడవగుట

నీదు జీవితమెల్ల కన్నీటి వఱద
చేసికొబోకు — వ్యర్థప్రయాసతోడ
త్యాగమన్నది ప్రకృతి సిద్ధంబె కాని,
త్యాగి కాడెవండును వీతరాగియయ్యు న

త్యాగమటన్న వేఱొక మతంబని తల్పకు — పెండ్లిమాను వై
రాగులు త్యాగులా నరవరాగ్రణి! పెండిలియన్న స్వీయ భా
గ్యోగ సుఖాలకోసమనుకోకుము — విశ్వజనీనజన్య సే
వా గతికీ గృహస్థవిధి వన్నియదెచ్చు నితోధికమ్ముగన్

చదివితి వెల్లశాస్త్రములు చాలును — ఇంక గృహస్థజీవనా
భ్యుదయపదమ్ము చేరుకొనుమోయి కుమార!" అటంచునాడు నా
మదిగల సందియమ్ము లనుమానములెల్లనుతీర్చి 'పెండ్లియా
డెద'ననుదాక నన్వేడువడే గురుదేవుడు దేనికోసమో

తనకొక కూతురున్నదికదా! గురుదేవుడు చెప్పదయ్యె నా
కును మునుపెన్నడేని కనుగొన్న గురూత్తము నొప్పుకొం
దును మఱి ఈ మనోహర వధూ మధురోష్ఠ సుధానుపాన జీ
వన పదవీ సుఖమ్మనుభవమ్మున కబ్బులుజాచి వేడనే!

ఏవిఘ్నమ్ము లెంతచేసిననుకాని—నాదుసంకల్ప వీ
ధీ విస్రంభము వీడజాల నిక ఈ తీవ్రప్రవాహమ్ము పా
రావారమ్మును చేరగావలయు నర్థప్రాప్తి కాకున్నచో
జీవన్ముక్తుడ నౌదు నంచని తపఃసింహాసనాసీనుడై

గుప్తమునైనప్రేమ తమిగ్రుక్కిళు ల్మింగుచు, నకులందు ని
క్షిప్తమునైన తృప్తి నెఱిగించుచు, భావిసుఖైక జీవనో
ద్దీప్తమనస్కుడై జపవిధిన్ దవ దావ శిఖా సహస్ర సం
తప్త పయోధి సప్త దుహితామణికై తపియించె నాతడున్

ఓ జగచ్చక్షు! పద్మాక్ష! ఓ అనంత
కాల పరిణామమూర్తి! లోకైక శక్తి!
చండభానుండ! సుప్రసన్నుండవగుచు
అవధరింపుము స్వర్గదుర్గాధినాథ!

ననుప్రేమించుటకాదురా! ఇది—హృదంతస్సారదందహ్య మా
నునిగా చేయుటసుమ్ము—నేనివియు సంతోషమ్ముతో నోర్చుకొం
దునుదేవీ! భవదుజ్జ్వలత్ప్రణయతప్తున్ నన్ను శుష్కింప జే
సిన నీ యందము నంతకంతకు ప్రకాశించున్ సముద్దీప్తమై

ఏండ్లు పూండ్లెన్నొ గడచిపోయినవి ఇటులె
కాలచక్ర మహావేగ గమనమందు—
నా దడవి చివురించి శృంగారమంగ
శ్రీ ప్రదానందవాసంత లక్ష్మికులికె

ఆకు నాకులోన నలరు నలరులోన
తీవ దీవలోనను పూవుబూవులో న
పూర్వ ప్రాణసంచలన ప్రపుల్లమగుచు
వెల్లి విరిసిన దా వనంబెల్ల మిగుల

జరజరమంచు శుష్క పుట సంపుటముల్ దిగజాఱిపోవు మ
ర్మర మధురధ్వనుల్ మలయమారుత సంచలనమ్ము తె వశీ
కరణ మహేంద్రజాలమునొకాని; చరాచరమెల్ల భూనభోం
తర పంగాహ మోహవశతంబడి మైకము నొందుచుండెడిన్

త త్తఱపాటుతో నడవిదాగు వసంతకుమారి పైట ఉ
వ్వెత్తుగలేచి యుగ్రసురభీకృత దక్షిణగంధవాహు ను
న్మత్తుని చేసివైచినది — మన్మథుమాయలచేతనేమొ పూ
గుత్తులుసైత మొండొకటిగూడుట లాడుటలున్ విచిత్రముల్

ప్రత్యుషమందె సంవరణుపజ్ఞుడువచ్చె నినుండు ద్వాదశా
దిత్యులు నొక్కమా అరుగుదెంచినమాడ్కి ధగద్ధగాయతౌ
ద్ధత్యమెకాని, ఆతపన తాప కదుష్ణమమేనిలేదు సా
జాత్యులు పుష్పవంతులు ప్రసాదగుణోజ్జ దభేదచింతనుల్ !

అవురా నీవని నేనెఱుంగనుకదయ్యా! భారతీయ ప్రసూ
తివి-సామ్రాట్టువు-నాకు శిష్యుడవు నట్టిన్ నీకు నేమీయమం
దువొ వాక్రుచ్చుమటన్న నత్తపసితోడ్తోలేచి కన్నీటి బిం
దువులున్ ఱెప్పల జిప్పిలంగ పునరుక్తుల్ గాగ ప్రార్థించుచున్

ఓ ప్రభూ! నీకు జోహారు లో అతీత
తేజసాంరాశి! ప్రత్యక్షదేవ! దేవ!
నా తపస్సు ఫలించి ఈనాటినుండి
నీదు కారుణ్యమున సుఖాన్వితుడగానె !

తపతి తపింపజేసినది—తద్విరహానల కీలలందు సం
తపితుడనై విదగ్ధమయినాడను స్వామి! దయాసముద్ర! ఓ
అపరిమితప్రభావ! భవదాత్మజ నాకు ననుగ్రహించి నా
తపము ఫలింప నన్ను చరితార్థుని చేయ నమస్కరించెదన్

తోచదు—స్వర్గసుందర వధూ నవయౌవన నిత్యనూతన
శ్రీ చెలువమ్మునేనియు రుచింప దికేదియు-నీకుమార్తెపై
దోచిన ప్రేమయే అడుగుదున్ దయచేయుము నీప్రకర్షహ
ర్షాచరితుండనై పున రయాచితవృత్తి సుఖింతునో ప్రభూ !

కనికరించి గగన పురోగామియయ్యె
సూర్యభగవాను—డంత చక్షువులు మోడ్చి
ధ్యానమగ్నుడైయుండె నత్తపసి—ప్రకృతి
చిత్రరచితముగాగ—వచ్చినది తపతి

ప్రేమతపస్వియుం దవతరించినదా మె—విదీర్ణవిద్యుదా
శామయ రేఖయోయన రసాతలమెల్లను రత్నకంబళిం
గా మిఱుమిట్లుగొల్ప చిరకాల కృతోగ్ర తపస్సమాధి ని
ష్టామితకష్టమెల్ల నిమిషార్ధములో ఫలియింప నత్తఱిన్

ఓం తత్సత్

